# నర్తనశాల

[ ఏచకవఫ నాటకము ]

***

విశ్వనాథ సత్యనారాయణ

# అంకితము

మిత్రునకు కొల్లిపర సూరయ్యకు

వర్ణవైషమ్యంబు నాడిపోయిన యయ్య
అర్ణవవైశాల్యమైన నీ యాత్మలో

శారదజ్యోత్స్న వర్షాతుషారమ్ములు
నీ రమ్యమూర్తిలో నిగ్గుతేరిన యయ్య

చిగురు వేదములు వాసించు నీ లోపల
నగరయ్యలే యశోనవ్యవల్లరులకు

రమణీయపూర్వసారస్వతప్రేమలో
కమనీయుఁడైన భాగస్వామి వైనావు

విశ్వనాథ సత్యనారాయణ
కొడాలి ఆంజనేయులు

## పాత్రలు

| | |
|---|---|
| కీచకుడు | ద్రౌపది |
| శారద్వతుడు | సుదేష్ణ |
| కంకభట్టు | ఉత్తర |
| తంత్రీపాలుడు | వల్లకి |
| వలలుఁడు | దాసి |

## ♦ ప్రథమాంకము ♦

### నాంది

ఆర్తత్రాణపరాయణత్వమున హైమాంబుప్రవాహాభమై
ధూర్తప్రాణహరత్వనిష్ఠమయి నుద్భాతార్చిషంబై జగత్
కర్తృత్వాదుల కేకకారణము నై కామాగ్నికుండంబు నౌ
తార్తీయీకము శైవలోచనము సంధానించు నైశ్వర్యముల్

అనులయనృత్యదాత్మవృషభాధిప ముగ్రజటాసముల్లస
త్ఫణభుజగాభిరామము రవన్మురజోద్గతశబ్దశాస్త్రకా
రణము క్రమప్రకారమధురస్వర మూర్జితమైన శ్రీత్రిలో
చనునవసాంధ్యతాండవముసాధుమృదూక్తులమాకొసంగుతన్

(నాంద్యంతమున సూత్రధారుఁడు)

ఆలస్య మేమియును లేదు. ప్రథమదృక్పాతముననే బద్ధప్రణయుఁ డగు నాయకుంబోలె నీ నాటకమునెడ ప్రథమ పరిచయముననే బద్ధాదరులమైన మేము, దీని విషయ మేమి యయినను జెప్పుటకూడ న్యాయముకాదు. అయినను మా కావ్యము నాదరభావముతోఁ బరిశీలించుటకుఁ ద్రయీమూర్తులైన పారిషదులఁ బ్రసన్నులఁ జేసికొనెదము.

మున్ను కలశాంబునిధిఁ ద్రచ్చుకొన్నయప్పు
డా మహాదేవి జనియించె కామధేను
మూర్తి సాక్షాత్సరస్వతి పుణ్యరాశి
ఆమె కపరావతారము లంటి మీరు, (తెర)

# ప్రథమాంకము

## ప్రవేశము — కీచకుడు, ద్రౌపది, ప్రస్త

కీచకుడు :

మద్భుజార్జితధారుణీమండలంబు
గెలుచుండె విరాట ధాత్రీశ్వరుండు
శత్రునృపతులు మత్స్యదేశముల పైని
దృష్టి పఱుపరు నా కంటిమెఱుపుఁ జూచి

నేను సుదేష్ణ తోఁబుట్టువు. నా పేరు సింహబలుఁడు. ఈ యంతఃపురమున నీవు క్రొత్తదానివలె నున్నావు. నీ పేరడుగవచ్చునా?

ద్రౌ : (మౌనము)

కీచ : నేను మా యక్కగారి యంతఃపురమునకు వచ్చి సంవత్సరము కావచ్చినది. అప్పుడు నిన్నుఁ జూడలేదు. ఏలనో నిన్నుఁ జూచిన నీతో మాటాడవలె ననిపించినది. క్రొత్తగా యని సంశయించితిని.

ద్రౌ : (మౌనము)

కీచ : ఈ జాజిపూవులతావి యెక్కడిది? నీ మేన నుండియా? నీ వెన్నాళ్ళయినది యిక్కడకు వచ్చి? మా యక్క నీచేత నేమిపనులు చేయించును?

ద్రౌ : (నిష్క్రమించును.)

సుదేష్ణ : (ప్రవేశించి) నాయనా! ఎప్పుడు వచ్చితివి?

కీచ : ఇప్పుడే వచ్చితిని. — ఇటుల వెళ్ళినది. ఆమె యెవ్వరు?

సు : నీవు మీ బావగారికిఁ గనంబడితివా?

కీచ : కనబడ లేదు. ఆయమ యెన్ని దినము లైనది యిచ్చటకు వచ్చి?

సు : ఎవ్వరో పరిచారిక! ఇంటివద్ద నందఱు బాగుగనుండిరా మనవాండ్రు?

కీచ : బాగుగనే యున్నారు. ఆ కాంత యెవ్వరు?

సు : ఆమె యెవరో సత్కులీన. తమ్ములందఱు బాగుండిరా? అమ్మ తిరుగుచున్నదా? విశ్రవసుఁ డాడుకొనుచున్నాడా?

కీచ : అక్కా!

ఆ మనోహర దివ్యరూపాతిశయము
మానవాంగనలందు సామాన్య మగునె?
యెచట దొరకించుకొంటివో యీవు సేవ
కప్సరఃకంఠయోగ్యమౌ నాభరణము?

సు : నీ కేమైన పిచ్చియా? మీ బావగారు నీకుఁ గబురంపించ నెంచుచున్నారు! నీవే వచ్చితివి.

కీచ : ఆ యమ యెవ్వరో చెప్పవు?

సు : ఉత్తర నిన్నుఁ జూడవలె ననుచున్నది. దానిని దీసికొని వచ్చెదను. నీవు నా గృహమువద్ద నుండుము. (నిష్క్ర)

కీచ : ఎంత పలుకరించిన మాటాడ లేదేమి? ఆ చూపులలోఁ ద్రాసమున్నది. కాని యది క్రొత్తడితన మేమొ! ఆ వదనాంచలము లేమి? యా శరీరరేఖ లేమి? ఎంత సౌందర్య నిధానములు!

ద్రౌ : (ప్రవేశించి) సుదేష్ణాదేవి యిచ్చట లేదే! ఈ పూల దండ నామె కియ్యవలెనన్న నామె యెచటి కరిగెనో?

కీచ : (చూచి) అదిగో! మఱల నిటులనే వచ్చుచున్నది.
(సమీపించి) ఆ పూలమాల నీవు గూర్చిన దేనా?
అవును! నీవ కూర్చి యుందువు! లేకున్న నంత యంద
మెక్కడిది దానికి? అది యెవరికొఱకు గ్రుచ్చితివి?

ద్రౌ : (స్వ) పొరబాటున మఱల నితని గలిసికొంటిని.
(పోఁబోవును)

కీచ : (అడ్డువచ్చి) చెలి! ఇదియేమి? నీ కోమలశరీర ముప
వాస కృశీభూతము చేయుచున్నావు! ఈ మేనుమాత్రము
తపోయోగ్యమైనది కాదు. కంది, చూడు మెఱ్ఱబారినది.

ద్రౌ : (తొలఁగి పోఁబోవును)

పరిచారిక : (ప్రవేశించి) స్వామి! కీచకమహారాజ! దేవి
యుత్తరా సహితయై తమ్మెదురు చూచుచున్నది.

కీచ : (స్వ) ఈమె విషయము మా యక్కగారివలనఁగాని
బోధపడునటుల లేదు. (ప్ర) ఆమె యెక్కడ నున్నది?

పరి : వసంతపాలికోద్యానమున!

కీచ : (నిష్క్రమించును.)

ద్రౌ : ఇతఁడు ముం దచ్చటికేఁ బోవును గాబోలు. నేనేల
వీనివెంటఁ బోవలయును? తరువాత నీ సంగతి సుదేష్ణతో
విన్నవించెదను.
కుడికన్నదరుచున్నది. ఇది బాగుగాఁ బట్టిన ముసురే
కావలయును. ఇత డెవరై యుండు?

పరి : ఏమమ్మా సైరంధ్రి! ఏమో యాలోచించు
చున్నావు?

ద్రౌ : ఏమియు లేదు. సుదేష్ణాదేవి యెచ్చటకు వెళ్ళినది?

పరి : మహారాజు కీచకస్వామి వచ్చెనని యాయుష్మంతురా లుత్తరను దీసికొనివచ్చుటకున ర్తనమందిరమునకు వెళ్ళినది.
ద్రౌ : ఆమె వెళ్లుట యేల? పరిచారికలు లేరా?
పరి : కీచకస్వామియెడ నామెకుఁగల సౌదర్యమువలన!
ద్రౌ : ఎవ రీ కీచకుఁడు? మున్నెన్నడు వినలేదు.
పరి : కొంచెము గౌరవముగా మాట్లాడుము. ఆయననామము నిరుపపదముగా నుచ్చరింపరానిది.
ద్రౌ : క్షమింపుము. ఆయన యెవ్వరు?
పరి : సుదేష్ణాదేవియు, నాయనయుఁ బినతల్లి పెదతల్లి బిడ్డలు.
ద్రౌ : ఈయన యిపు డెచటనుండి వచ్చినారు?
పరి : ఆయన నివాసము విరాట నగరముననే కాని యా రాజ మందిర మీపట్టణమున కావైపుననుండును. ఎందుకు నీ వాయననుగూర్చి ప్రశ్నించెదవు?
ద్రౌ : పురుషులకుఁ బ్రవేశింపరాని యీ యంతఃపురము నీతఁ డెట్లు ప్రవేశించినాఁడు? భూమింజయాది రాజకుమా రులే ప్రవేశింపరాదే?
పరి : ఆయనకు సుదేష్ణాదేవియెడగల చన వట్టిది. అదియుఁ గాక యాయన భుజాబలమే మత్స్యధాత్రీతలమునకు రక్ష.
ద్రౌ : (మౌనము)
పరి : అతఁడు నూటుగురుతమ్ముల కన్న. సకల పరివారము తోడ నతఁడు కొలువున నిలచినచో విరాటుడు కాదు రాజు; ఆయనయే.
ద్రౌ : దుర్యోధనునకు నితనికి మంచిపోలిక యున్నది.
పరి : ఆయన మానవతీ పంచబాణుఁడు.

ద్రౌ : నేను దేవిగారిని గలిసికొనవలెను. (నిష్క్ర)

పరి : సైరంధ్రి మొదలు తానేమొ నన్నతనిగూర్చి యడిగినది. నేను గొంచెము సూచించిన విముఖవలె నటించినది. కాషాయవస్త్రములు కల్మషము దాచఁగలవు.

ఉత్తర : (ప్రవేశించి) ఓసీ! వల్లకీ! మామకు జాతీ కుసుమములు కోసికొని రమ్ము. పూలమాల గ్రుచ్చవలె.

పరి : అమ్మా! తమకై నాయ దయచేసిరే! తమకుఁ గనఁబడ లేదా?

ఉ : ఆయనను బుష్పమాల వినా నేను దర్శించను.

పరి : సైరంధ్రియొద్ద నొక టున్నది.

ఉ : పోయి తీసికొని రమ్ము!

పరి : (నిష్క్రమించును.)

ఉ : (స్వ) ప్రస్తావనలో బృహన్నలోపాధ్యాయులు సైరంధ్రిని దాము మున్నెఱుఁగుదుమనియు, హస్తినలోఁ దాము శ్రీ యుధిష్ఠిర చక్రవర్తి యాస్థానమున నాట్యాచార్యులుగా నున్నప్పు డీ సైరంధ్రి యచటనే యుండెడిదనియుఁ జెప్పి యామెను గూర్చి మిగుల గౌరవముగఁ బ్రసంగ మొనర్చినారు. ఆయమ గ్రుచ్చిన పూమాల మా మామకొసంగిన బాగుగ నుండదేమో! (ప్ర) వల్లకీ! వలదు. నీవు పోయి పూచిన యా మందారవద్ద నున్న జాతులు తీసికొని రమ్ము!

పరి : (జాతులు తెచ్చి యిచ్చును.)

ఉ : ఆహా! ఈ జాతీకుసుమవాసన లెంత మనోహరముగ నున్నవి?

ప్రవేశము : సుదేష్ణ, కీచకుడు.

ఉ : మామా! ఈ పూవులు నీకై తెచ్చితిని.

కీచ : అమ్మా! సౌభాగ్యవతివికమ్మ.

సు : తల్లీ! మామయ్యకు నమస్కరింపుము.

ఉ : (అట్లు చేయును.)

కీచ : (లేవదీసి) అమ్మాయికి నాట్య మెంతవరకు వచ్చినది? మొన్న నెపుడో చూచినా నీ యమ గురువును. మనో హరముగ నున్న దా మూర్తి. సాహిత్య తేజ మాతని మొగమున గంభీరముగ నున్నది. అక్కా! అమ్మాయికి పెండ్లి యెప్పుడు?

సు : కళ్యాణపు గడియలు రావలయును.

కీచ : ఉత్తర సిగ్గుపడుచున్నది. ఎప్పుడు నేర్చితివమ్మా యిది. ఆ గురువు నేర్పినా యేమి?

ఉ : (స్వ) మామ మిక్కిలి రమ్యముగ మాటలాడు చున్నాఁడు. ఇతనిని గూర్చి కొన్ని వదంతులు చెడ్డగా నున్న వేలనో!

కీచ : అమ్మా! నీవు బాగుగాఁ జదువుకొనుము. ఇది తీసి కొమ్మ (అని మెడలోని హార మిచ్చును.)

ఉ : (గ్రహించి) పాఠశాలలోఁ బుస్తకములు వదలివచ్చితిని. సెలవు తీసికొందును.

సు : వల్లకీ! నీవు తల్లివెంటఁ బొమ్మ.

(వల్ల - ఉత్తర - నిష్క్ర)

సు : నాయనా! నీవు నాట్యశాస్త్రమున మహాప్రజ్ఞ కలవాఁడ వందురుగా! అమ్మాయి నేమియుఁ బరీక్ష చేయలేదేమి?

కీచ : సోదరీ!

ప్రథమ దర్శనమ్మె యింతవఱకు రెండు
గడియ లేనియుఁ గాలేదు కలఁగిపోవు
చున్నయది నాహృదంతరం బూఱడిలక
అంత సౌందర్యవతి ఆ లతాంగి యెవరు?
అప్సర స్త్రీస సమాజంబు లా వెలంగి
కాలిగోటి కేనియు సరిగారు సుమ్మ
ప్రకృతిలో నున్న సౌభాగ్యభాగ్య మెల్ల
నలవరించు కొన్నది యా లతాంగి యెవరు?
ఏడుదీవుల రాజ్యంబు లేలుబడికి
చిహ్నమైన కిరీటంబు శిరమునందుఁ
దాల్చుటకు యోగ్యమైన దా తలిరుబోఁడి
యంత తేజస్సు కల దా లతాంగి యెవరు?

సు : పర స్త్రీ ప్రశంస పాపహేతువు కాని యింకొక విష యము మాటలాడుము. ఆ భాగ్యశాలిని యెవరో పాపము. మన యంతఃపురమునఁ దల దాచుకొనవచ్చినది.

కీచ : అక్కా! క్షమింపుము! ఏమిచేయుదునమ్మా!

ఈ శ్రవోరంధ్రముల గింగురెత్తు చున్న
దసమమార్గణధను రుజ్ఝి తాశుగముల
వేగమునఁ జేసి సుడివడి వీచుచున్న
గాలి చేసిన యట్టి యుగ్రస్వనంబు.

సు : ఒకప్పుడు చిత్తవికార మేర్పడినను, దానిని స్వాధీన పఱచుకొనవలయును. మఱల నా ప్రశంసఁ దేకుము.

కీచ : అక్కా!

సు : రాజాంతఃపురములయం దిట్టి యిక్కట్టు లున్నవనియే యావిడ తొలుత నావద్దఁ బ్రవేశించుచున్నప్పుడు, తనున్న గౌరవముగా చూడఁగలిగిననే నావద్దఁబనిచేసెదనన్నది. ఈ యెనిమిది నెలల నుండి చూచుచుంటిని. ఆమె తులసిమొగ్గ వంటిది. ఆమె సైరంధ్రీ వ్రత మనుష్ఠించుచున్నది.

కీచ : అక్కా! నా ప్రాణములమీఁది యాస వదలుకొమ్మనెదవా?

సు : అబ్బా! ఇదియేమి? ఆమె మొగముఁ జూచినఁ బూజింప వలె నను భావము గలుగును గాని యిట్టి దురూహాలు నీ కెటుల పుట్టినవి?

కీచ : నా కామె పాదాభివందనముగూడఁ జేయవలె నని యున్నది.

సు : ఆమెకు విరాటనృపతి యంతఃపురము తలదాచుకొనునైనది. ఈ యంతఃపురము నీ యీ దుష్టభావమున కామెను లోఁబఱచదు.

కీచ : కాక నా ప్రాణములు త్రుంచుకొని పోవునా మఱి.

సు : నాయనా! ఈ యధర్మమునకు నన్ను లోఁగఁదీయకుము. మహాపౌరుషశాలివైన నీ బుద్ధి పరకాంతలపై నేల ప్రసరింపవలె?

కీచ : అక్కా! ఈ మనస్సెంతవఱకు నన్ను బాధించుచున్నది! ఆ మనోహారిణి వేరైన వినఁజాలనేని నా యీ జన్మ మెందులకు?

సు : అది నాకుఁ దెలియదు. ఆమె సైరంధ్రీవ్రత మనుష్ఠించుచున్నది. కాన నామె నిందందఱును సైరంధ్రియనియే

వ్యవహరింతురు. నీ వింత పిచ్చిలో నున్నావుగాన నీ కొక మాట జెప్పెదను. ఆమెకుఁ బతులుగలరఁట. వారు గంధర్వులు. అయిదుగురు. మహాబలశాలులు. వాయుసమాన విక్రములు. నా రామెమీఁద నీగ వ్రాలనీయరు. నిరంతర మామెను రక్షించుచుందురు. ఆమె వెంటనే యదృశ్యులై తిరుగుచుందురఁట యెల్లప్పుడును.

కీచ : నన్నెందులకు భయపెట్టెదవు?

కనరాక రిపుల నొంచెడు
ననంగుఁ డొకరుం డజేయుఁ డంతియ నా క
న్నొనల విరియించు రక్తిమఁ
గనుంగొనినదాఁక బ్రతుకగలదె రిపులకున్.

ఆ ప్రశంస కేమికాని — (అర్ధోక్తిలో)

సు : నీయందు నాకుఁగల యభిమానమునకు మంచి ఫలము కలిగించుచుంటివి. ఇంక నే నిందుండుటగూడ మంచిది కాదు. నా యిందున్నంతసేపు నీ వదుగక మానవు. నేనెంత కోపగించుకొన్న నేమి! కాని చెప్పుచున్నానువినుము! నీకిదితగదు. నాయంతఃపురముననే యిట్లు తలఁచినవాఁడవు నీ వింకెందు దురూహలకుఁ జో టివ్వవు? ఇట్లు మాటలాడుట నీవుగాన నింతవఱ కోర్చుటయైనది. ఈ యూహలింక మానెదవనియే యనుకొందును. (నిష్క్రమించును)

కీచ : నిజముగా మాయక్కగారికిఁ గోపమువచ్చినది. అవును! ఆమెతో నజ్ఞానము కతన నెట్టి ప్రసంగము చేసితిని? ఆ సౌందర్యము నన్ను వెన్నాడు చున్నది. ఆహా! సాక్షాత్కారము. ఏ మా సౌందర్యము!

సముసంధ్యామనోజ్ఞ ప్రశాంతవేళ
మలయపర్వతనిర్గతానిలకుమార
వీచికాసంచలితమయి వెల్లివిరియు
నమృతనిష్యందిమాధుర్యంబు ననుకరించు.
అతిశయితబాలకేతకి యై ప్రభాత
చంద్రికాసితనవనీతసౌకుమార్య
మై శరత్కాలసితజలదాభ మగుచు
నా హృదంతరమూలధనంబు దులిచె.

ద్రౌ : (ప్రవేశించి) సుదేష్ణాదేవి యీవఱకు నొంటరిగా నుండునా? అంతకంతకుఁ బ్రొద్దు గ్రుంకుచున్నది. ప్రొద్దు గ్రుంకకముందే సుదేష్ణాదేవితోఁ జెప్పవలయును. (పరిక్రమించి) అహో నేఁడు నా దురదృష్టమేమొ! ఇతని నొంటరిగాఁ గలసికొంటిని. ఇందు సుదేష్ణాదేవి యున్నదని చెప్పినదే వల్లకి! దాని ప్రవర్తన బాగుగ నుండలేదు. తొలఁగిపోయెదను గాక!

కీచ : ప్రేయసీ! నన్నేల త్రిప్పలు వెట్టెదవు?

ఒకమాట పలికి నంతన
సకియా! ముత్తెముల వరుస జారిపడునటే?
ప్రకుపితనేత్రద్వితయ
క్రకచంబులు నన్నుఁ గోయఁగా నేమిటికే?

పలుకంగరాదె యో ప్రాభాతవేళామృ
తస్యందినీరజాతసమవదన!

నను( జూడరాదె యీ నవ్యశారద కాల
  సితనవాంభోదకల్పితదృగంత!
చెఱునవ్వ రాదె యీ శ్రీకరచ్ఛవిదీప్త
  తరుణరత్నోదీర్ణదంతపంక్తి!
సుంత నిల్వగరాదె శోభాగమనరమ్య
  మధురమరాళాభమందయాన!
యెంత నిర్దయురాలవే యిగురుబోడి?
తావకీన సర్వాంగసౌందర్యమందుఁ
బ్రసవమార్దవ ముండియుఁ బైకినింత
కఠినతామార్గ మేలనే కంబుకంఠి!

దేవి! కన్నెత్తి చూడుము! నీ దృగంతభాగిరథీవాహినిలోఁ బవిత్రుడనై పోయెదను స్నానములాడి.

ద్రౌ : అన్నా! ఏమిది? ఈ వికృతాకార మేమి? నేనేమి? నన్నుఁ జూచిన నీకు మదన వికారమా? నినుఁ బరియాచి కములాడ నిచ్చగలిగిన నావంటి పిచ్చివాండ్రతో నా యాడవలె! దేవి సుదేష్ణ కోపగించును. నాకుఁ బని యున్నది. త్రోవ యిమ్ము పోయెదను!

కీచ : ఓహో! శరత్కాలచంద్రరేఖ! ఎంత మాటాడితివి? నీ కృపాపాంగములకై వేఁచిన యీ దీనునకు నిన్నెల కసటు మాటలాడి విముఖను జేసికొనును?
మాధుర్యమా! నన్నెల నీలో నొకభాగమునఁ జేరనీయక విషమ్మున దించెదు? సామాన్యముగఁ బురుషు లిట్లే ప్రథమమున బ్రేమావేశముఁజూపి యనంతరము పరిత్యజింతురనుకొందువో! మనోహారిణీ! ఇదె ఒట్టుపెట్టుకొనెదను.

రమ్యజలదమాలాసిలసౌమ్యగగన
భాగరమణీయమైన యీ ప్రావృషమునఁ
దీరుగాఁ బూఁచినట్టి మందార మిదిగో
యీ శిరోభాగమున కరం బిడుగో యుంచి!

ద్రౌ : నమస్కరించెదను. నన్నుఁ బోనిండు.

కీచ : చెలీ! నాపై నీ కింతవఱ్ఱ కేల ననుగ్రహము రాలేదు? నా పూర్వజన్మకృతపాపఫల మెంతగాఁ బాధించుచున్నది! ప్రియా! దయఁజూడు, దయఁజూడు.

(చేయి గ్రహించఁబోవును)

ద్రౌ : ఓయీ! ఎంతటి తెలివిమాలినవాఁడవు. దాసీ సంగమము లాయుఃక్షైణ్యములు. అందులో నికృష్ట దాసినైన నన్నా నీవు వరించునది?

కీచ : మదవతీ! ఆయుఃక్షైణ్యమా! కానిమ్ము! నీ సంయోగములేని యాయువుమాత్ర మేమిటికి? స్వర్గభోగము లనుభవించనా? ఆనందధామము లెక్కనా?

నీదు గాఢపరిష్వంగ నియతిఁ గలుగు
నిముస మేనియు బ్రతికితి నేని చాలు
నీ కెడము గల్గి కల్పముల్ నిండువఱకు
బ్రతికితిని యన్న! భస్మహావ్యంబ, యేల?
నీ యురోజాగ్రమునయందు నిదురలోన
మృత్యుదేవతనైన రానిమ్ము నాకు
భయము లేదే మృగాక్షి! యీ భవమువలనఁ
గలుగు లాభ మా పూర్వమే గలిగియుంట.

నీ పరిరంభమునన నిందీవరాక్షి
తఱుఁగునే యన్న యాయువు, తఱిగె నేని
మిగిలినదె యనుభూతమా మెలంత! కాక
యిపుడె గతియింతు కాదటనే లతాంగి!
(సమీపించును)

ద్రౌ : (తొలంగి) పరస్త్రీలపై నేల ప్రసరించుచున్నవి నీ దృక్కులు? నీవేమొ బాహుబలతృణీకృతాఖిలమత్స్యదేశ శాత్రవుఁడవటే! ఇది నీకు యోగ్యముకాదు. పరస్త్రీ సంగమంబునఁ గలుగుదోషమును నీవంటి దోషజ్ఞునకు నాచెప్పఁబనిలేదు.

కీచ : ప్రేయసీ! కనంబడుచున్న దివ్యజ్యోతిస్సును జల్లార్పకుము. (చేయి గ్రహింపఁబోవును)

ద్రౌ : (తొలంగి)
నావెంటన్ నిరతంబుఁ గాచికొని యున్నా రేవు రస్మత్పతుల్
ద్యావాభ్యంతరగాము లెందయిన గంధర్వుల్ స్వకీయోగ్రబా
హావిధ్వస్తసమస్తశాత్రవసమూహానంతకీర్తిస్ఫురత్
శ్రీవిద్యోతితమూర్తు లాకెలన నీ చేటింతయున్ దప్పదే!

కీచ : ఇదియా యింతవఱకు నీ యనుమానము? నీ కేమియు భయములేదు. నాబలము నాచేతనే యేలపొగడించెదవు? రాజసములు సుష్ఠుగాఁబంచు నీ మత్స్యదేశములే దానికి సాక్షులు.

ప్రసవమార్గణబాణసంపాతభీతి
నా శరీరావయవముల వాసి చూడు

నుడుచుకొని యెంత బాణము పడునో యేమొ
యంచుఁ గుంచుకొన్నవో యోసి చంచలాక్షి
ఆలస్యముచేసి నన్నేలదహించెదు? నీయాలస్యంబుకొలఁది
నా ప్రాణములునిల్చుననుధైర్యముకూడనాకుఁజెడుచున్నది.

ద్రౌ : ఓయీ! మహాగ్నిఁజూచి ఫలమని భ్రమించుచుంటివి.

కీచ : చెలీ! దయచూడుము! నీ శరీరస్పర్శచేతనే పులకిత బ్రహ్మానందముపొందు నాకేల దూరదూరము పోయెదవు?

(సమీపించును)

ద్రౌ : సుదేష్ణా! అయ్యో! నా జన్మకిది మూడవపరాభవము. సుదేష్ణా!

కీచ : అయ్యో! భూతలస్పర్శమాత్రభిన్న మైన స్వర్గ మేల నిరాకరించెదవు?

ద్రౌ : అయ్యో! నీ యీ ప్రవర్తన మీ యక్కగారి యంతఃపుర గౌరవమునకు భంగకర మైనది.

కీచ : (నివ్వెఱవోయి) మంచి సంగతి జ్ఞాపకము జేసితివి. కాని నా హృదంతరము దహించుచునే యుంటివి.

ఏ ప్రశీలతవాఃకణశ్రీప్రకాశ
మైన నిముసంబునందు నా యంగ మంటి
ప్రసవనిర్గతమకరందమసృణశిశిర
మైన నీ మేను స్వర్గసౌఖ్యం బొసంగునో!

(నిష్క్రమించును)

సు : (ప్రవేశించి) అమ్మో! సైరంధ్రి. ఇదేమి? శోకాధిదేవతవోలె నున్నది.

ద్రౌ : దేవి! చూచితివా యీదీనురాలి యవమానము.

సు : ఏమమ్మా?

ద్రౌ : నీ తోఁబుట్టువట. అతనిపేరు నాకుఁ దెలియదు. మీ రెవ్వరు లేకుండ నన్ను చెఱఁబట్టవచ్చి, దేవి! యేమని చెప్పుదును. నాజన్మ మేమోకాని సురక్షితములైన ప్రదేశములలో నేనాకుఁబరాభవములు తటస్థించుచున్నవి. చెప్పితిని గదా తొలుత నీకో, నేకానొక కారణమువలన నాపతుల యెదుటనే నిండుసభలో మున్ను పరాభవింపబడితినని. మఱల నిదిగో. భూమింజయాది రాజకుమారులుగూడ రారాని యీ యంతఃపురమున నా స్థితి యెట్లయినది?

సు : అయ్యో! ఎంతపని జరిగినది. తల్లీ! ఇది యెవ్వరితో ననకుము. నేను వానిని చీవాట్లు పెట్టి పంపించెదను. ఇంక నీవున్నంతవఱకు నతఁ డిచటికి రాకుండఁ జేసెదను. నా కెంతటి యప్రతిష్ఠ వచ్చు పని చేసినాఁడు? నా చేతనైనంత వరకు వానిబారి నీవు పడకుండఁ జేసెదను. దురపిల్లకుము.

ద్రౌ : కానిమ్ము. నీ యండఁ జేరితినిగదా! దానివలన గలుగు ప్రతిష్ఠా ప్రతిష్ఠలు నీవియే.

సు : అమ్మా! మన్నింపుము. నే నతని కన్మొఱఁగిపోవుటకే యిచటినుండి వెళ్ళితిని. నే నున్నచో నట్టిది తటస్థించెడిది కాదు. నీ విచ్చటి కెట్లు వచ్చితివి?

ద్రౌ : అతఁడు మొదట నన్నుఁ గలసికొని యేదియో ప్రసంగించ వచ్చినాడు. నేను మాటాడక యతని దప్పించుకొని నీతోఁ జెప్పవలె నని యిచ్చటికి వచ్చితిని. మీరు లేరు. అతఁ డిందుండెను.

సు : చెలియలా! యిక్కట్టులలో నున్నవారికే క్రొత్తయిక్కట్టులు. నాతో వాఁడు నీ ప్రసంగమే తెచ్చినాఁడు. నే నతని యెదుట నున్నంతవర కట్లే మాటలాడుననియు, నతని వదలిపోయిన బాగుగనుండుననియు, నేనిచటినుండి వెడలిపోతిని. నీతో నీవిషయము చెప్పి యతఁ డిందున్నంత సేపు నీవు వాని కన్నులకుఁ గన్పింపకుండ నుండుమని చెప్పుటకు వచ్చితిని. నీవు నాకు గనరాలేదు. దుర దృష్టమువలన నీ విచ్చటికే వచ్చితివి కావలె. తల్లీ! నీ కడుపుపుచ్చుకొని బతిమాలెదను. సుదేష్ణయంతఃపురమున నిట్లు జరిగెనని చెప్పుకుమయ్యా యెచ్చటను! నేను నీకింక యెద్దడి లేకుండఁ జేసెదను. అట్లు చేయ నని నా చేతిలో చేయి వేయుము.

ద్రౌ : అన్నవస్త్రము లిచ్చి పోషించితి విన్నాళ్లు. నేఁ జేడియో నా దురదృష్టమున నిట్లు ఘటిల్లినది. నీ వేమి చేసెదవు? తల్లీ! నిన్ను నే నెఱుగనా! నీపై నేదేని యని నే నేమని బ్రతుకగలను.

సు : నీ వింక పద-వల్లకీ! సింహబలుఁ డెందున్నాడు?

(తెరపడును)

* ద్వితీయాంకము *

ప్రవేశము :— కీచకుఁడు. ఉద్యానములో

సీ॥ ఈ విరహావహ్ని నన్ను దహించు నిసియుఁ
గాల్చి బూడిద చేయదు కాయ మింత
యా లతాంగి దయావ్యాపృతాక్షియుగము
ప్రాణములనోడ లే దేమొ ప్రాప్తి నాకు?

ఆ మనోహారిణి కపోలస్పర్శ గావించియో, యా జగన్మోహిని యధరామృతరసాస్వాదన మొనరించియో, గాఢముగ నాలతాతన్వీపరిష్వంగ మనుభవించియో, చివరకా ముద్దరాలి కరాంభోరుహము నంటియో వచ్చిన, నా మనస్సున కింత వేడిమి యుండెడిది కాదు.

ఏ ప్రశీతలవాఃకణ శ్రీప్రకాశ
మైన నిముసంబునందు నా యంగ మంటి
ప్రసవనిర్గతమకరందమసృణశిశిర
మైన నీ మేను స్వర్గసౌఖ్యం బొసఁగునో?

యని చివరకని వచ్చితిని. ఆమె రసికురాలయిన నా మాటలలోని రసజ్ఞత్వము దెలిసికొనదా? అప్పుడు నా భావోన్మాద మా జవరాలికి బోధపడదా?

ఊరక నాకుఁ బిచ్చియాలోచనలే కాని, యామె యప్పటి స్థితి జూచిన నా మనోరథము కొనసాగునట్లు లేదు. నే నామెను స్పృశింపఁబోయినప్పుడా పొలంతుక స్త్రీసహజమైన సిగ్గుచేతఁ గంపించినట్లు లేదు. నిజముగాఁ దన పాతివ్రత్యము పాడైపోవునేమోయని భయబడినట్లున్నది కాని— నా యప్పటిమాట లామె కసలు వినంబడెనో లేదో! అక్కటా! నా దౌర్భాగ్య మే మని చెప్పుదును!

నన్ని లతాప్రతాన మెంత వేధించుచున్నది? చల్లన గదా యని యిచ్చోటు జేరితిని.

ఇది వసంతమా? కోకిలైన గూయుచున్నదా? అకాలమున నీ కెందు కింత యలజడి!

అభినవజలధరసుందర
మిభరాజకిశోరహస్తవృతమో యను ని
నభ మింత నీ సుమాస్త్ర
ప్రభావమున కెట్లు సాయపడునో మదనా!
చాలు నే ముందు నా యంగసంధు లెల్ల
విఱుగఁబొడిచితి నీమహావేశమింత
యొప్పునే యవేళల నేమి యొరిగి పోయె
ధర జలధిలోన నీకుఁ దొందరయెగ్గాక.

నా సంక్షుభితమైన యీ దేహము కొంచెము విశ్ర మించినఁగాని తేరుకొనదు. (పండుకొనును)

వల్లకి : (ప్రవేశించి) ప్రభూ! ప్రభూ! ఏమి ఈయన మాటా డఁడు? పాపము! ఈయనను నే నెఱుంగుదును. కొంచెము కష్టమేనియు నోర్చుకొనలేఁడు.

అబ్బా స్త్రీ లెంతకుఁ జాలరు? ఏమో యభినయము! ఈ సైరంధ్రి విషయము నే నెఱుఁగనా! మహా పతివ్రతవలె నటించుచున్నది. ఏదీ, యీ విషయమున నా చెప్పి నటులఁ జేయక పోనిమ్ము. ఈమె పరువేమైన దక్కనిత్తు నేమో! ప్రభూ!

కీచ : (లేచి) వల్లకీ! యెందుకు?

వ : స్వామీ! అదియేమి? ఇట్లు పడిపోతిరి?

కీచ : ఏ మున్నది? నా ప్రాణము లా మనోహారిణి గుంజు కొనుచున్నది.

వ : చిత్తము.

కీచ : వల్లకీ! ని న్నొక టడిగెదను.

వ : మహాప్రసాదము.

కీచ : ఆమె పే రేమి?

వ : సైరంధ్రి యని వాడుక. అసలు మాలిని.

కీచ : మా యక్కగారి యంతఃపురమున నెన్ని దినములుగా నివసించుచున్నది?

వ : సంవత్సరము కావచ్చు చున్నది.

కీచ : ఆమె వృత్తాంత మింతకన్న నేమియుఁ దెలియదా?

వ : ఆమె కయిదుగురు పతు లున్నారట. వారు గంధర్వులు.

కీచ : (ఊరకుండును)

వ : ఏ మాలోచించు చున్నారు?

కీచ : నీకు నామెను నేమియుఁ జెలిమి లేదా?

వ : ఎక్కువ లేదు.

కీచ : ఆమె లోచనములలో లౌల్యమున్నది. అయిదుగురు భర్తలకు భార్యయా! ఎంత కాముకి!

వ : మీ రనునది నాకుఁ దెలియుట లేదు.

కీచ : ఆమె కనులలోఁ జిత్ర మున్నది. ఆ కన్నులు నీ కెట్లు కనఁబడును?

వ : నే నెప్పుడు నాలోచించలేదు.

కీచ : ఏమో కష్టము ననుభవించిన జీవి కన్నులవలె నుండవా?

వ : ఆ! అట్లే యుండును.

కీచ : అవి యంతియకాదు. కామోద్రేకమునుకూడ సూచించుచున్నవి. ఆ యమనుగురించి నీకేమయిన ననుమానము లున్నవా?

వ : ఆమె దేవరవారి కంత యలభ్య కాదు.

కీచ : ఏమో చెప్పుము.

వ : ఆమె రాత్రులం దప్పుడప్పు డెచటికో పోవుచునే యుండును.

కీచ : పతులు గంధర్వు లంటివే! వారును నీమెయు నేర్పరచుకొన్న సంకేతమున కేమో!

వ : అయిన —

కీచ : అప్పు డామె శీలమును మన మెట్లు శంకింపఁ గలుగుదుము?

వ : కాని పతులతో మాత్రము నిశాకాలములయందు స్వైర సంచారము సేయు మని యున్నదా?

కీచ : అదికాదు. ఆమె ప్రవర్తన యెట్టిదో తెలియవలెను.

వ : నిజమైన మాట కిటువంటి స్త్రీకి గంధర్వు లెవరు భర్తలు కాఁగలుగుదురు?

కీచ : ఎందుచేత?

వ : ఈ మాత్రము సౌందర్యమునకా?

కీచ : ఈ మాత్రము సౌందర్యమునకా! వల్లకీ! స్త్రీల సౌందర్యము స్త్రీలకుఁ దెలియదు.

వ : అయినను గంధర్వులు మనుష్యుల కెట్లు పతులు కాఁగలుగుదురు?
కీచ : ఆమె సౌందర్యమునకు గంధర్వులేకాదు. త్రిలోకాధి పతులుగూడ తల లొగ్గవలె.
వ : మీ రెన్నియైనఁ జెప్పుడు. ఆమెను గురించి నా కనుమా నము పోలేదు. వ్రతములని, నియమములని; కాషాయం బులు కౌపీనంబులు ధరించుట కేమిగాని యందఱును మనుష్యులే.
కీచ : మా యక్క సుదేష్ణ యెక్కడ నున్నది?
వ : ఆమెతో సైరంధ్రి యేమి చెప్పినదో, పట్టపుదేవి తమకై వెదకుచు వచ్చినది. నేను మిమ్ము వెదకి తీసికొని వచ్చె దను. మీ రంతఃపురమునకు పదుడని యామెను బంపించి వచ్చితిని.
కీచ : ఏమి చెప్పియుండును?
వ : ఏమి చెప్పియుండును, ఇదియే.
కీచ : మా యక్క యే మని యుండును?
వ : దేవిగారికిఁ గోపము వచ్చిన ట్లున్నది.
కీచ : కోపమే!
వ : రండు పోదము. ఆమెను బ్రసన్నను జేసికొందురుఁగాని.
కీచ : వల్లకీ! నే నిందుండి కదలఁజాలను.
వ : అయిన నేను బోయి యామెను మీయెడలఁ బ్రసన్నను జేసెదను.
కీచ : ఎట్లు?
వ : ప్రభువులు నిస్పృహులై యీ పూవుఁదీరమ్మునఁ బడి

పోయిరని, పిలచిన పలుకుట లేదని చెప్పెదను. అప్పు డామె కోపము పోవును.

కీచ : సరే. నే నిందే పండుకొనెదను! పొమ్ము!

(వల్లకి నిష్క్రమించును(

కీచ : (ఆలోచించుచు)

చారుమంగళనవ్యవర్ణాతిశయిత
లలితమృదులనీలాబ్దమాలామధురిను
పట్టువడె తదంచితకేశబంధ మందు
ఆ లలితకైశికము బంధమయ్యె నాకు!

ఆమె సైరంధ్రి యని కాని, యింకేమియుఁ దెలియదా? అంతటి యజ్ఞాతావస్థ యెందులకు? ఆమె భర్త లైదు గురా? ఈ కథ యేమో స్మృతికిఁ దెచ్చుచున్నది. ఆమె యెవరైన నేమి? ఆమనోహారిణికి నాయందు దయ లేదుగా!

గాఢపరిష్వంగకలితసౌఖ్యాంభోధి
తరఁగలు మచ్చిరోధార్యములగు

తత్కరస్పర్శ మొత్తమ్ములై గుమిరెడు
పులకలు మేనఁ బ్రభూతము లగు

మద్దృగంతమ్ముల మసృణచంచలవిని
లాపాంగముల్ ప్రేమదీపిక లగు

నా మూర్తి కా చిరంటీమందహాసచం
ద్రికలు మున్నాకడు దీర్ఘికలె యగుచు

ఆ విలాసిని పయ్యెద యంచె నాకు
రేఁబవల్ నిద్ర లగు నామె మృదుమనోజ్ఞ
సు ప్రసన్నాననప్రభాజ్యోత్స్నలంద
యీ హృదయ తాప మడఁగునయేని నాకు.

నా ప్రాణములు జివ్వన లాగుచున్నవి. కొంచెము విశ్రమించెదను. (పండుకొనును)

ప్రవేశము—సుదేష్ణ, వల్లకి

సు : వల్లకీ! తమ్ముఁ డెచ్చట?

వ : అమ్మా! ఇటు నిటు. ఇదిగో యీ లతావలయమునొద్ద నొడలు తెలియక పడియున్నారు.

సు : (చూచి) నాయనా! సింహబలా!

వ : అమ్మా! నేను బిలచితిని. పలుకలేదు.

సు : అయ్యో! ఇదియేమి? దీనికి గారణము?

వ : ఎట్లు తెలియఁగలదు?

సు : వైద్యుని బిలుచుకొని రమ్ము నీవుపోయి.

కీచ : (లేచి) ఏమమ్మా! అంత నిర్దయ. ఎవరా వైద్యుడు? మీ రనుకొనుచున్న మాటలు నేనువినుచునే యున్నాను. ఓపిక లేక మాటాడలేదు. నా యీవ్యాధికిఁ చికిత్స చేయించనెంచెదవేని యా వెజ్జు నెవరో పిలుచుకొని వచ్చుటేల?

సు : ఇంక నదియే ధోరణియా? పరకాంతలపై నింతదురూహ గల నీవు బాగుపడవు. సైరంధ్రి యెవ రనుకొంటివి? మత్స్యదేశాధీశుని యంతఃపురపరిచారిక. ఆమెమీద నీఁగ వ్రాలినచో విరాటనృపతికిఁ దలఁపరాని తలవంపు. మత్స్యదేశమునకు నీ వండ వనుమాట నిజమే. నీ యండ దేనికి

మాకు? ధర్మము నడుపుటకు; న్యాయము దీర్చుటకు. రాజులు గలరు. రాజాంతఃపురములు గలవు. ఇట్టి యపభ్రంశపు పను లెందును జరుగవు. నా గొంతులోఁ బ్రాణముండువఱకు నీ కా స్త్రీ లభింపదు. నీయంత బాహాబలశాలులు కాకపోవచ్చునుగాని నా భర్తయుఁ బుత్రుఁడును నంత తేజోదరిద్రులుగారు. నీకు నిజముగా నా లతాంగి మీఁదనే యభిప్రాయముండెనా మొట్టమొదట మత్స్యదేశమును భిన్నముజేసి మాయందఱ కుత్తుకలు గోసి యనంతర మానెను హరించుకొని పొమ్ము. (నిష్క్ర–)

కీచ : హా! హా! ఇవి యేటి మాటలు. అక్కా, నన్ను రక్షింపు మని కాళ్ళఁబడితినిగాని యధికారము జూపించితినా? ఆమె కంత తొందర యెందులకు? ఈ మన్మథానల మోర్చుకొనలేక నే నుండగాఁ ద న్నే మంటిని? విరాటనృపతి నా వలననే బ్రతుకుచున్నాఁడా? నేనే యతని రక్షించుచుంటినని యంటినా?

ఈ మహాంబోధిఁ దరియించు టెట్లు? అబ్బా, శూలముల వంటి మాటలు! ఆమె నిందాక వదలిపెట్టినది యిది తన యంతఃపురమని గదా! నిజముగా రాజ్యమంతయు నా భుజబలముమీఁదనే యాధారపడియున్నను నేను వారికి నమ్రుడనయియే యుందునుగాని రాజసపుపోకడలు పోను. అక్కా! ఇంతమాత్రము తెలిసికొనలేకపోతివి. సింహబలుడు నేడో రేపో యీ మన్మథానలమునఁబడి నశించి పోయినప్పుడు శాత్రవులు మత్స్యదేశము నాల్గువైపుల నుండి చుట్టుముట్టినప్పుడు, నామాట నీకు జ్ఞాపకము రాఁ

గలదు. అపు డనుకొందువు, "అయ్యో! అంత వినయవంతుడైన తమ్ముని చేతులారఁ జంపుకొంటిమే" యని. అప్పుడు మీ కెవరు సాయపడుదురు? సైరంధ్రిపతులైన గంధర్వులు వచ్చి సాయపడుదురు గావలయు.

వ : స్వామీ! నిరాశఁ జెందకుఁడు.

కీచ : మొట్టమొదట నీ మాలిని వచ్చి కొలువునఁ బ్రవేశించినప్పుడు నీ వున్నావా?

వ : చిత్తము.

కీచ : అప్పు డీమె యేమని చెప్పి ప్రవేశించినది? అప్పటి మాటలు జ్ఞాపకము చేసికొని యొక్కొక్కటే నెమ్మదిగ నన్నియుఁ జెప్పుము.

వ : తనపేరు మాలినియనియు, దాను గూడు బట్ట యిచ్చిన సేవఁజేసెద ననియుఁ నీచవృత్తిఁ జేయననియు తానొక్క సంవత్సరముకన్న నిందుండ ననియుఁ జెప్పినది.

కీచ : ఒక్క సంవత్సరమేనా! తరువాత!

వ : తన విరోధు లెవరో, నిండుసభలోఁ దన్ను దలపట్టుకొని యీడ్చి రనియు, నీ సంవత్సరమైన తరువాత తనకు మంచి రోజులు వచ్చుననియు — అప్పు డా పగ తీర్చుకొను నఁట.

కీచ : ఇది నా కొకవిధముగాఁ దోచుచున్నది.

వ : ఏ విధముగా?

కీచ : వల్లకీ! మా యక్కగా రన్నమాటలు నీ వన్నియు విన్నావుగద.

వ : చిత్తము.

కీచ : మఱి యే గతి?

వ : ఈ కార్యభారము నామీఁద వేయుఁడు.
కీచ : నీ వెట్లు చేయఁగలవు?
వ : దేవరవారి దయయున్న నది యెంతసేపు?
కీచ : ఎట్లో చెప్పుము.
వ : సైరంధ్రి యర్ధరాత్రములయం దప్పుడప్పు డెచ్చటికో వెళ్లుచుండునని మీతోఁ జెప్పితినే. ఇప్పుడు దేవిగారివద్దకు బోవుచుఁ ద్రోవలో నామె కనంబడ నడిగతిని.
కీచ : ఆమె యే మన్నది?
వ : ఏమన్నది! మొగము వెలకిల వేసినది: మఱల దెలివి తెచ్చుకొని అది నీ కెందుకు? అన్నది. ఇది యంతయు నేను బయటపెట్టనా యని బెదిరింపగా చెప్పుకొనుము. నా భర్తలవద్దకుఁ బోయితి నన్నది.
కీచ : మఱి యట్లయిన నిం కేమందువు?
వ : స్వామీ! అదికాదు. నిజముగా నామె భర్తల వద్దకే పోయెనేని యామె మొట్టమొదట నే నడిగినప్పుడు మొగము తేలవేయవలసిన యవసరమే లేదు. ఇది తరువాత గ్రుక్క ద్రిప్పుకొని యనినమాట.
కీచ : సరి, దానికేమి! నీ విప్పు డికార్య మెటుల సాధించగలవు?
వ : ఆమెను మీ యింటికి బంపించెదను.
కీచ : (ఆశ్చర్యముతో) అది యెట్లు సాధ్యము?
వ : సుదేష్ణాదేవికి మదిర యన్న మిక్కిలి యిష్టము. తమ యింట దొరకునంత మంచి మదిర భూమండలంబున నెందును లేదుగద. కావున మీ యింటనుండి మదిరఁ

పెచ్చెదనని నేను చెప్పెదను. తరువాత నే నేకో పనిమీఁద నున్నట్లు నటించి సైరంధ్రి నీ పనిమీఁదఁ బంపించెదను.

కీచ : ఆమె రాదేమో!

వ : అయ్యో! ఇది సేవావృత్తి. దారిలోఁ ద్రాచుపాము కాపువేసికొని కూర్చున్న దని తెలిసినను వెళ్ళి తీరవలెను.

కీచ : వల్లకీ! అంత మోస మెందులకు?

వ : దేవరవారి చిత్తము.

కీచ : ఆహా! ఇదేమి?

ఒకయెడ నిది న్యాయము కా
దు కాదనియె యంతరాత్మ చూపించెడుఁ ద
ప్పక చేయకున్న నసువులు
పెకలించెడినో మరుండు పీతదయుండై

వల్లకీ! నీ యీ మోసము సుదేష్ణాదేవికిఁ దెలిసినచో!

వ : ఆమె మీ మీఁద నిప్పుడు కోపగించి పోయినదా? ఇదే యామె నీరాత్రియెల్ల వేధించును. ఆమెను నిద్దుర పట్టదు. "అయ్యో! సింహబలు నల్లెందుకంటి" నని తహతహ పడుచుండును. అప్పుడు కొంచెముమద్యముత్రాగి నిదురించిన శాంతిగా నుండు నని చెప్పి మత్తు పదార్థము గలిపి యామెకుఁ ద్రాగించెదను.

కీచ : సైరంధ్రి నీమాటలమీఁద రాక సుదేష్ణాదేవి యాజ్ఞ పుచ్చుకొని గాని రా నను నేమొ.

వ : ఆ మత్తులో దేవి ప్రతిదానికి ఊఁ, ఊఁ, యని యంగీకారమే.

కీచ : తరువాత నిది యామెకుఁ దెలిసిన!

వ : ఒక్కసారి సైరంధ్రి తమ యింటికి వచ్చిన తరువాత వాని విషయమునుగూర్చి యామెతోఁ జెప్పినది యెవరు? సైరంధ్రి యేమంత పిచ్చిదా? రానున్న సిరికి మోకాలడ్డు పెట్టుటకు. ఆయింట రాజభోగముఁ జూచి యామె మరల నీ యంతఃపురమునకు వచ్చినగద.

కీచ : వల్లకీ! మఱి సైరంధ్రి యెప్పుడు వచ్చును?

వ : ఈ రాత్రి వచ్చునో రాదో! తెల్లవారు వఱకుఁ దమ గదప దగ్గర నామె యుండఁగలదు.

కీచ : ఇది నిజమేనా!

వ : సంశయము లేదు. సెలవు.

(నిష్క్రమించును) (తెర)

## * తృతీయాంకము *

### ప్రవేశము—సుదేష్ణ

సుదేష్ణ : నే నన్నిమాట లనినను జవాబుకూడఁ జెప్ప లేదు. నాయం తెంత వినమ్రుఁడు! అట్టివాని నూరక పట్టుకొని యెన్నిమాటలు, ఎట్టెట్టి మాట లంటిని? ఇతఁడేమి ధూర్తముగాఁ బ్రవర్తించెనా?

అతని భుజాబలమున మత్స్యదేశములు శత్రుభీకరముగా నున్నవి. మత్స్యదేశములు ధర్మభూయిష్ఠము లన్నచో నది యతని భుజోపార్జిత పౌరుషమువలన. అతఁడన్న నా మనోనాథునకు నెంత గౌరవము! అతని నంతగా నుపాలంభించుట తప్పే.

అయినను నంతమాత్ర మనవలసినదే. అతఁడు నా మాట లెక్కసేయఁడా? చేయక? మాలిని విషయమున దుష్టముగాఁ బ్రవర్తించవలె. అది యెన్నటికిని జరుగనేరదు. జరిగినచో నిక నాది యతఃపుర మేమిటి? ఇతఁడేమిటి? ఉత్తరుఁడైన నిట్టి పని జేసిన నిందార్హుఁడు. శిక్షార్హుఁడు.

ఎంతగా నిశ్చయించుకొనినను నతని నిట్లు పలికిన తరువాత నా మన స్సంత శాంతముగా లేదు.

(వల్లకి ప్రవేశించును)

సు : వల్లకీ! మా సింహబలుఁ డే మైనాఁడు?

వ : వారి యింటికి వెళ్ళినారు.

సు : నే నట్లనఁగా నే మన్నాఁడు?

వ : పాపము, కళ్ళనీళ్లు పెట్టుకొన్నారు.

సు : అయ్యో!

వ : మీ రప్పు డెటువంటి మాటలన్నారు. వారు చాల మంచివారు గనుకనే యూరకున్నా రని నాయుద్దేశ్యము.

సు : ఊరుకొనక ఏమిచేయు నందువు?

వ : దేవిగారిని వారేమి చేయఁగలుగుదురు? వారికిఁ గోపము వచ్చెడిదే యింకొక రైనచో.

సు : అవును. అతనికిఁ గోపము రాలేదు.

వ : మీరు వచ్చిన తరువాత "వల్లకీ! మా యక్కగారు చూచితివా న న్నెట్టి మాటలన్నదో! ఛీ! యింక నాబ్రతు కెందుకు? ఆమెచేత నిట్టిమాటలు పడి నే నీ యంతఃపుర మున నుండుటకన్న సిగుమాలినపని లే" దని వెళ్లిపోయి నారు.

సు : ఇంక నిక్కడకు రాఁ యేమి?

వ : ఏమో!

సు : అతఁ డీ పాటి కెంతదూరము వెళ్లి యుండును?

వ : రథ మెక్కి వెళ్లిన యాయన యెంతదూరమైన వెళ్ళును.

సు : వల్లకీ! నిజముగ సింహబలునకుఁ గోపము వచ్చినదా?

వ : గోపము నాకుఁ దెలియదుగాని దుఃఖము వచ్చినది.

సు : అది సరియేకాని పాప మా పతివ్రత జోలి తన కెందుకు?

వ : అమ్మా? ఎవ్వరి సంగతు లెట్టివో! అందఱకు నెట్లు తెలియును?

సు : నా కీ నాడు తలనొప్పిగా నున్నది.

వ : అది తలనొప్పి కాదు.

సు : మఱి యేమి?

వ : కీచకమహారాజుగారి నన్యాయముగ నట్లంటిరేమో యని తను మనస్సులో నున్న యాందోళన.

సు : కావచ్చును:

వ : కొంచెము విశ్రమింపుడు.

సు : (పండుకొనును.)

వ : అమ్మా! ఇప్పు డెట్లున్నది?

సు : వల్లకీ! సైరంధ్రిని బిలువుము.

(వల్లకి నిష్క్రమించును)

సు : సైరంధ్రి గొంతుక యెంత మంచిది! కంచు గీచిన ట్లుండును సంగీతము విన్నచో నా తలనొప్పి తగ్గునేమో! సైరంధ్రి యెవ్వరో! ఆమె రాజాంతఃపురముల సేవ జేయుటకుఁ దగనిది. ఆమె కేమైన పని జెప్పవలెనన్న నాకుఁ దల కొట్టుకొన్న ట్లుండును.

వ : (ప్రవేశించును.)

సు : సైరంధ్రి యేది?

వ : వచ్చుచున్నది.

సు : (స్వ) ఆమె పట్టమహిషి యగుటకు యోగ్య. నడచుచున్నప్పుడు కలహాంసవలె నుండును. తొందరగా నడువనే లేదు.

సైరంధ్రి : (ప్రవేశించి) దేవిగారు నన్నుఁ బిలువనంపిరి.

సు : అమ్మా!

సై : ఈ సంబోధనమే నీ యాభిజాత్యముఁ జెప్పుచున్నది.

సు : నాకుఁ దలనొప్పిగా నున్నది.

సై : ఏమైన శ్రమ గలిగిన దేమొ.
సు : ఏమియు శ్రమ లేదు.
సై : గాలి యంత బాగుగ లేదు. వలిగాలి వీచుచున్నది.
సు : మబ్బులు బాగుగాఁ బట్టిన ట్లున్నవే.
సై : కొంచెము సన్నని తుప్పర పడుచున్నది.
సు : వల్లకీ నీవు దుప్పటి తీసికొని రమ్ము. (వల్లకి నిష్క్ర.)
సై : ఎందుచేత వచ్చినట్లు తలనొప్పి?
సు : వల్లకి దుప్పటిఁ దెచ్చినదా?
వ : (ప్రవేశించి) ఇదిగో! కప్పుకొనుఁడు.
(సుదేష్ణ కప్పుకొనుచు)
సై : (స్వ) బంగరు జరీయంచుఁ గల నీ సేలువ కప్పుకొన నీమె సూర్యకిరణములు వ్యాపించి తళతళలాడు తెల్ల మొగిలుచేఁ బ్రకాశించు సంధ్యావతివోలె నున్నది!
సు : (వల్లకితో) నీవు వెళ్లుము. (వల్లకి వెడలిపోవును.)
సై : మొగముమీఁదగూడఁ గప్పుకొనుఁడు.
సు : ఊపిరాడదు. నా తలనొప్పి యుపశమించుట కేదైనఁ బాడి వినిపించుము.
సై : వర్షర్తువును గూర్చి పాడుదునా?
సు : పాడుము.

సైరంధ్రి :

స్వైరీభవత్కేశభారాయితోత్తాల
కాదంబినీస్నిగ్ధ కాంతి యగుచు
మసృణకేశనిబద్ధకుసుమమాలాయిత
సౌదామినీప్రభాజాల యగుచు

అనినిరంతరపతత్ ద్రుతవర్ష బిందు సం
 పూరంబున రసార్ద్రమూర్తి యనుచు
శ్రీబలాకావధూటీబద్ధమాలిక
 ద్యన్నూత్నమౌక్తికహార యనుచు
పతి పరిష్వంగమునకయి బడలియుండి
క్రొత్తంగా వేసమును గూర్చుకొన్న వధువు
వలె వినూత్న భావములందుఁ దోలుసులాడు
వారిబిందుల కన్నీట వర్షఋతువు.

సు : తలనొప్పి కొంచెము తగ్గినటుగా నున్నది. ఇంకొక గీత
మును బాడుము.

కడిమి పూచినదొ లేక చిగిర్చినదొ యంచుఁ
 దొంగి చూచినది విద్యుల్లతాంగి
యెదురుగా నరుదెంచు భృంగమ్మునకు స్వాగ
 తమ్ము పాడినది మందారసుమము
పతిసంగమార్థమ్ము పరువులెత్తినది శై
 లాగ్రనిస్స్రుత నిర్ఝరాబ్జనేత్ర
సిగ్గుచెందినది పచ్చికబయ ళ్ళనుపేరి
 పులక లందినయట్టి పుడమి పడఁతి

నవ జలదమాల సేయు గానంబులకును
నవమయూరాంగనలు సల్పు నాట్యములకు
భరతశాస్త్ర దేశికమాళి పాఠశాల
వోలెఁ జూడ ముచ్చటయయ్యెఁబో వనంబు.

ప్రథమవర్ష బిందువుల పైఁ బట్టువడిన
ప్రకృతి యేవిధమ్మైన మఱల్చుకొన లేక
యీ బలాక లాకాశపు టెల్లలందు
నందు నాబద్ధనిశ్రేణులై మెలంగు.

శ్రావణముచేత నిల్లి యాషాఢమాస
బహుళపక్షమ్ము హరియింపఁబడియె నేమొ
యెంతదళ మయి క్రమ్మిన ఏ జలదము
లమృతనిష్యందములు హృదయాంచలములు

నవవయఃప్రౌఢ లైనట్టి నాతుకలు వ
సించు నీ సౌధపుగవాక్షసీమలందు
నీలజలదశకలరమణీయములును
బహుమనోజ్ఞము లగురుధూపములు గ్రమ్మె

ఏమీ! ఈమె నిద్రపోయినదా యేమి? నే నిం కిందుండి పోయెదను.

సు: (అర్ధనిద్రలో) వల్లకీ! కీచకుని బిలుచుకొని రమ్ము.

సై: (బెదరి తనలో) ఇదియేమి? అతని పేరిప్పు డేందులకు? (ప్ర) అతఁ డిప్పు డెందుకు?

సు: (అర్ధ నిద్రలో) అతని నే ననరాని మాట లంటిని. సైరంధ్రి మాటలు నమ్మితిని.

సై: సైరంధ్రి యబద్ధము చెప్పిన దందురా?

సు: (అ-ని) ఆమె యట్టిది కాదు.

సై: (స్వ) ఈమె బెదరుచున్నది. పాపము; ఈ రాజ్యము వాని భుజబలముమీఁదనే యాధారపడి యున్నదఁట.

ఆతఁడు పోయిననేమి? సుదేష్ణా! నీకు వచ్చిన భయము లేదు. సంవత్సరము నీ రాజ్యమునఁ దలదాచుకొన్న కృతజ్ఞత మీా రాజ్యరక్షణార్థము పాండవ సింహములచేత నేమి చేయించలేదు? (ప్రకాశముగ) దేవి! నిదురపొమ్ము. ఇంకొక గీతము పాడెదను. అప్పుడే చీఁకట్లు గ్రమ్మినవి.

ఈ శిశిరవాయువులు సన్నయీాల వేయు
నల్లనల్లన తరుశాఖలందుఁ జేరి
ప్రణయినీనవ్యసంకేతపద్ధతులను
నెన్నిదినములుగా నేర్చుకొన్న వగనో.
ఇంటిచూారుల నుండి స్రవించు నీటి
బొట్టు లొకరీతిగాఁ బడి భూామిమీాద
సరియగు నెడము గలిగి నిస్వనము సేయుఁ
బుడమిపైఁ జిన్నగుంట లేర్పడెడు నట్లు.
అరవిరిసినట్టి కలువలయందు జేరి
మురిసికొనుచున్నయవి నీటిబొట్లు వరుస
నాడుకొన నింటిమూాలలయందుఁ జేరి
మెల్ల ముడుచుక కూర్చున్న పిల్లలట్లు.

ఈమెకు నిద్ర పట్టినది. నేను బోయెదను. (నిష్క్ర-)

వ : (ప్రవేశించి) సైరంధ్రిపోయి యెంతసేపైనది. మత్తుపదార్థముఁ గలిపి మద్యము సిద్ధము చేసితిని.

సు : (అర్ధ నిద్రలో) వల్లకీ! నీవు కీచకుని యింటికి బొమ్ము.

వ : మద్యము దెచ్చుటకా?

సు : (అర్ధ నిద్రలో) మంచి మద్యము దీసికొనిరా!

వ : తీసికొని వచ్చితిని. పుచ్చుకొనుఁడు.
సు : నాకుఁ గన్నులు తెరుపుడుపడుట లేదు. నీవు నన్ను నెమ్మదిగఁ గూర్చుండఁబెట్టి యిమ్ము.
వ : (అట్లు చేయును)
వ : ఎట్లున్నది? ఇది మీ తమ్ములు కీచకమహారాజుగారి కొరకుఁ జేయఁబడినది.
సు : (పండుకొనును)
వ : ఇంకఁ గొంచెము తెప్పించనా?
సు : ఊఁ—
వ : సైరంధ్రి వెళ్ళి తీసుకొనివచ్చెద ననుచున్నది.
సు : ఊఁహూ.
వ : ఆమెయే వెళ్లెద నన్నది.
సు : ఊఁ.
వ : సైరంధ్రి యిప్పు డేమి చేయఁగలదు? నేను ముందు వసారాలో నిలఁబడెదను. సైరంధ్రితో నెమ్మదిగా మాట్లాడ వచ్చును. నేను రాకముందే యీమెకు నిద్ర పట్టినది. సింహబలునితో సైరంధ్రిని నే నడుగనిదే యడిగతి నని చెప్పితిని. కాని మ్మిప్పు డడిగెదను. వచ్చుచున్నది.
సై : (ప్రవేశించి లోనికిఁ బోఁబోవును)
వ : దేవిగారు నిద్రపోవుచున్నది. ఎవరిని లోనికి రానీయ వద్దన్నది.
సై : (తిరిగి పోఁబోవును)

వ : మాటమ్మా! ఏ మంత తొందర! ఇప్పు డెంత ప్రొద్దు పోయినది?

సై : ఒక జాము ప్రొద్దుపోయి యుండవచ్చును.

వ : ఇప్పుడు నీవు నడచి యొంటరిగా నెక్కడికైనఁ బోఁగల్గుదువా?

సై : ఎందుకుఁ బోవలయును?

వ : కాదు. వెళ్ళవలసి వచ్చినచో వెళ్ళఁగలవా?

సై : నీ వన్నమాటలు నా కర్థ మగుటలేదు.

వ : అది కాదమ్మా! నీకు భయము లేదా యని.

సై : నీకు భయము లేదా?

వ : నాకు భయము గనుకనే నీవు వెళ్ళఁగలుగుదువా యని యడిగితిని.

సై : నాకును భయమే.

వ : అవసరమైన పని యున్నదో?

సై : తప్పనిసరికిఁ బోదుముగాని భయ మెట్లును భయమే.

వ : నీకు భయము లేదు. నీవు రాత్రులం దెచ్చటికైనఁ బోఁగల్గుదువు.

సై : ఈ చమత్కారము బాగున్నది.

వ : ఎందుకమ్మా కోపము? నీకు భయము లేదని నాకుఁ దెలియునుగాన నే చెప్పితిని.

సై : ని కెట్లు తెలియును?

వ : అప్పుడప్పుడు నీవు రాతురులందు నొంటరిగా మే మందఱము నిద్రపోగాఁ జూచిపోవుచుందువుగా!

సై : అవును. పోవుచుందును.

వ : అందుకనియే భయము లేదన్నాను.

సై : ఊఁ. భయము లేదు.

వ : ఇటువంటి రాత్రులందుఁగూడ భయము లేదా?

సై : ఏమో యది నీ కెందుకు?

వ : మన కేమి మాటలు లేవా? విరోధమా మనకు? అట్లు మాటలాడెద వేమన్నా?

సై : చెప్పఁదలఁచిన దేదో చెప్పుము. అనవసర ప్రశంస యెందుకు?

వ : నిన్నొకమాట యడిగెద ననుకొన్నాను. నీవు కోపపడిన చో నెందుకు?

సై : అవును, ఎందుకు?

వ : నాకు నడుగవలయు ననియే యున్నది.

సై : అడిగిన నడుగుము లేదా లేదు.

వ : నీ వట్లు పోవుచున్నది యెక్కడకు?

సై : నా భర్తలు గంధర్వు లైదుగు రుంటిరంటినే, బాహుబలతృణీకృతనిఖిలశాత్రవవీరులు! వారియొద్దకు.

వ : అబద్ధము.

సై : నోరుమూయుము.

వ : ఓయబ్బ! మిగులుమాట లెందుకు? నీ విప్పుడు తక్షణము కీచకమహారాజుగారి యింటికిఁబోయి సుదేష్ణాదేవికి మద్యముఁ దీసికొనిరావలయును. ఆమెకు మిక్కిలి తల నొప్పిగా నున్నది. తన్నెవరును మాటలాడించరా దన్నది. ఆయనగారింటివద్ద మంచి మద్యము దొరుకును. ఆయన ప్రత్యేకముగఁ దన యక్కగారి కని మదిర నిలువఁ

జేసి యుంచును. అది త్రావినగాని యామెకు శిరో భారము శమింపదు.

సై : అతని యింటికి నేను బోను.

వ : ఇది పనికత్తె యనవలసిన మాటయేనా?

సై : ఇంత చీఁకటిలో నెటు?

వ : ఏమో, ఎట్లో!

సై : నిజముగా నన్ను దేవి యచ్చటకు వెళ్లు మన్నదా?

వ : వెళ్లు మనలేదు. నేనే చెప్పితిని.

సై : వెళ్లుమన్నచో వెళ్లెదను. ఆమెను కనుగొని మఱి పోయెదను.

వ : ఆ యమ నిద్దుర లేపవ ద్దన్నది.

సై : నీ మాట నేను నమ్మను.

వ : నమ్మక పోయినచో నిక్కడ నూరకే కూర్చుండి సుదేష్ణాదేవిగారి కందాలోఁ బడి తినుచుండుము. వారి పనులను మాత్ర మక్కఱకు రాకుము. నా సొమ్మేమి పోయినది? ఆమె నీతోఁ జెప్పుమన్నది. నేను నీకుఁ జెప్పితిని. నీవు చేయుము. చేయక పొమ్ము. ఆమెచేత నీవు పని చేయించుకొందువో, యామెకే నీవు పనులు చేసెదవో యది మీకుఁ దెలియవలెను. నా కేమి తెలియును? (నిష్క్రమించును.)

సై : ఇది యేమో పన్నాగము పన్నినది. నే నీరాత్రి కీచకుని యింటికా? ఈ యర్ధరాత్రమున నా? ఏ పిడుగైనఁ బడినచో నేమియగుదును. హాయి! నా భర్తలు బ్రతికి పోదురు. స్త్రీ చిత్తము పురుషుని భాగ్యమన్నారు. నా

భర్త లిట్టి మహాపద లనుభవించుట నా మూలముననే గదా!

నేఁ డింత కథ జరిగిన తరువాత నన్ను వానియింటికిఁ బంపునా సుదేష్ణ? ఆమె యట్టిది కాదే! వల్లకి యేవైన దుష్టపు మాటలు చెప్పి యొప్పించెనా? వల్లకి యీ కోపముఁ జూచిన సుదేష్ణ చెప్పినట్లే యున్నది.

ఎఱిఁగి యెఱిఁగి పులియున్న పొదలోని కెట్లు పోదును? ఆహా! సేనావృత్తి యెంత చెడ్డది? నేనిప్పుడు పోకపోతినా నా భర్తల ధర్మమార్గ సంచారిత్వమునకు నా మూలమునఁ గళంకము రాఁగలదు. మాట నిలుకడకై . సకల రాజ్యమును దృణముగాఁ బరిత్యజించిన యుధిష్ఠిర చక్రవర్తి ధర్మపత్నినై నే నిట్టి యధర్మ మే మని చేయను? మరణ మైనను రానిమ్ము. యజమానురాలి యాజ్ఞ చేసి తీరవలయును.

ఈ యర్ధరాత్రమున నచ్చటి కెట్లు పోదును? పోదును బో! దారిలో నాకేమి? నా యీ ప్రాణము పిడుగుపడినను బోదు. ఇం కెన్ని కడగండ్లు పడవలసి యున్నదో!

తీరా, యచ్చటికిఁ బోయిన తరువాతఁ గీచకుఁడు పునః యట్లే ప్రవర్తించినఁ జేయవలసిన దేమి? నే నీ యర్ధరాత్రమున నెంత యాక్రోశించిన నెవ రడ్డు పడెదరు? ఎట్టులైన ఱే పుదయమున నైనచో నేమో, భారమంతయు సర్వేశ్వరునిపై వైచి పోయెదను.

వల్లకి యబద్ధము చెప్పినదేమొ. సుదేష్ణనే కనుగొనెదను.

సు : వల్లకీ!
సై : ఎందుకమ్మా!
సు : సైరంధ్రి కీచకుని యింటికి వెళ్ళినదా?
సై : (స్వ) ఇప్పటి కనుమాన నివృత్తి యైనది.
సు : దాహము.
సై : తెల్లవారక ముందే పోవలయునా?
సు : ఊఁ.
సై : ఈ గాఢాంధకారమునఁ బోవు టెట్లు?
సు : అయ్యో! దాహము.
సై : తెల్లవారిన తరువాతఁ బోయెదను.
సు : ఊఁ
సై : తెల్లవారువఱకుఁ గీచకుని యింటివద్ద నుండవలయును. ఇప్పు డెంత ప్రొద్దుపోయినది! అదిగో బాజారమున గడియలు కొట్టుచున్నారు. రెండు జాములు దాటినది. కాఱు చీఁకట్లు గ్రమ్మినవి.

(వల్లకి ప్రవేశించును)

సై : వల్లకీ!
వ : నాతో నీ కేమి పని?
సై : మఱి నీవేకదా నన్నుఁ గీచకుని యింటికి బొమ్మన్నది.
వ : వెళ్లెదవా?
సై : వెళ్ళ నక్కఱలేదా?
వ : వెళ్లెదవా? అది చెప్పుము
సై : ఊఁ
వ : సరే వెళ్లుము.

సై : మదిరకుఁ బాత్ర కావలయును. ఆయనయే యిచ్చె దరా?

వ : ఇక్కడనుండియే తీసికొని వెళ్ళవలయును.

సై : నీవు తెచ్చిపెట్టుము.

వ : మంజీరకుని నీవే యడుగుము. కొట్టులోనుండి తెచ్చి యిచ్చును.

సై : నే నెప్పు డిదివఱ కతనితో మాట్లాడలేదు.

వ : ఇప్పుడు క్రొత్తఁగా మాట్లాడుము.

సై : పరపురుషులతో నేను మాట్లాడను.

వ : నేను?

సై : నేను వ్రతమున నుంటినిగదా!

వ : మఱి కీచకమహారాజుగారితో నెట్లు మాట్లాడెదవు?

సై : (మౌనము)

వ : నా కెందుకు? ఇదిగో సువర్ణపాత్ర. ఇందాఁకనే తెచ్చితిని.

సై : తెల్లవారనిమ్ము.

వ : దేవిగారికిఁ దలనొప్పి యప్పటి కెక్కువ కాదా! నీ యిష్టము. (నిష్క్రమణ)

సై : సుదేష్ణ నన్నీ పనికి నియమించినదేమి? ఏమో! ఈమె పయోముఖ విషకుంభమేమో! ఏమి కానున్నదో!

(తెరపడును)

* చతుర్థాంకము *

నిశాభాగము. ప్రవేశము – కీచకుడు

కీచకుడు : ఆమె కాముకియే.

అరమూతల కన్నులు సుం
దరవక్రాపాంగములు వృథా సంచలదు
ద్ధురచేలాంచలములు నా
తరుణి హృదయభావములను దాచక చెప్పున్

నాలో నుద్భవించిన యీమహాగ్ని చాలదా! ఎందుల కీ గాలి యింత నిప్పులు చెఱుగుచున్నది? ప్రియా! నీ మూలమున నా కీ వర్షాసమయ శర్వరియందుఁ గప్పుకొనుటకు దుప్పటికూడ నక్కఱలేక పోయినది.

ఈ మేఘము లింత గర్జిల్లుచున్నవి. ఇవి సింహములా యేమి? శబర కన్యకలచేత నావృత మైన వనమ్మువోలె నల్లని యీ యాకాశ మీ జీమూతములచేత నెంత యొప్పుచున్నది! అదిగో మెరయుచున్నది.

ఓ జలదకన్యకా! యంద మొలుకుచున్న
నీ జఘనభాగమున రమణీయమైన
లలితసౌదామనీమేఖలానిబద్ధ
దృష్టి నగు నన్నుఁ గికురించె దేల యిట్లు?
శ్యామల మనోజ్ఞ మైన నీ చక్కఁదనము
తలఁచుకొన్నకొలంది యీ పులక లెత్తు,
మోహనాంగి వింత రసార్ద్రమూర్తి వచల
కఠినతామార్గముల నేల కాలువెట్ట?

మిత్రుఁడు శారద్వతుఁడు రాలేదు. నా కీ బాధ యేమో యపనయింపరానిదిగా నున్నది. వానలో రాలేక యూర

కున్నాఁడేమొ? మా మైత్రి యట్టిది కాదే. పిడుగులు పడుచున్నను రావలసినదే. యెవరు? శారద్వతా! (పోయి చూచి) ఈ యీఁదురుగాలికిఁ దలుపు త్రోసికొని వచ్చినది. ఈ యంధకారము నీ వర్షమును నా కెన్నివిధములుగా బాధాజనకము లగుచున్నవి! నా మిత్రు నేమో రానిచ్చుట లేదు. నా ప్రియురాలిని రానిచ్చునని తోఁచదు. ఏమో! నా కేది తలంచుకొనినను ప్రాణములు పోవుచున్నవి.

ఈ మన్మథుఁ డింతగా నామీఁదఁ గారములు మిరియములు నూరవలెనా? మే మేమి ధూర్జటుల మటోయి, మామీఁద దూకెదవు నీవు?

ఇదివఱ కెట్టివానికిని నే శరణంచు వచింప నీకుఁ బూ
నెద శరణంబు! నవ్యనళినీదళదివ్యశరంబు నేల పూ
నెదవు? కుమారగంధవహనీతమహార్చులలోన నన్నుఁ వ్రే
ల్చెదు సుకుమార! మార! దయలేక, కృపామతి నాదరింపవే.

అబ్బబ్బా! ఇంక నీ విరహ మెట్లాగుదును? నా కా జగన్మోహిని యెందుఁ గనంబడినదో! ఈ విరహము విరహము ప్రాణములు త్రుంచుకొనిపోవునా యేమి?

శారద్వతుఁడు : (ప్రవేశించి) ఈ మేఘము లెంతదట్టముగా నలముకొన్నవి! మిత్రుఁడు నాకై యెదురు చూచుచుండును. ఇది యేమి? చీఁకట్లింతగా గ్రమ్మినవి! సుపరిచితములైన యీ మార్గములే నాకు దుర్గ్రాహ్యములుగా నున్నవే! అదిగో మెరుపు! ఒక్కసారి తళుక్కు మని

మాయమైనది. కాని ప్రోవమాత్రము చూపినది. ఓ సౌదామనీ! నీవలన నభిసారికా కాంతల కెంత యుపయోగము! ఈ నిశాభాగము రమ్యముగానే యున్నది.
నా బట్టలు తడిముద్దలైనవి. మిత్రుని యిల్లు సమీపించితిని.

ఓసి సౌదామనీ! యింక నొక్కకొంచె
మింత మెఱయుము మెఱయు నీ యిల్లు వెండి
గాను బంగారమును గూడగాను ద్వార
బంధ మెట నున్నదో చూడవలయు నంత

ఎంత మంచిదానవు? సమయమునకు మెఱసితివి. అందు కనియే యమృతమూర్తులగు యువతీ రత్నములతోఁ బోల్చుదురు నిన్ను. సఖుఁడా! సఖుఁడ.

కీచ : (లేచి) రావోయి సఖుఁడ! వచ్చితివా?

శార : వచ్చితిని.

కీచ : నీకోసము నిముసములు యుగములుగా గడపుచుంటని.

శార : ఎవరికోసమో? నాకోసము గాదు.

కీచ : నిజముగా నీకోసము.

శార : నే నేమి స్త్రీనా?

కీచ : ఓయి స్నిగ్ధుఁడా! కాలము గడచుటలేదు. నీవు వచ్చిన గడచునుగదా యని.

శార : నేను వచ్చిన గడచునులే. అసలు గడువనిది నా కోసము కాదుగద.

కీచ : మిత్రమా, కూర్చుందుము. ఇప్పు డెంత ప్రొద్దు వోయినది?

శార : రాత్రి రెండుజాములైనది.
కీచ : ఇంత చీకటిలో నెట్లు వచ్చితివి?
శార : నే నొక్కఁడనే రాలేదు.
కీచ : మఱి యెవరితోఁ గలసి వచ్చితివి?
శార : ఒక ఖేచరాంగనతో.
కీచ : ఆమె యెచ్చట? ఏదీ?
శార : ఇంతవరకు వచ్చి వెనుదిరిగి పోయినది.
కీచ : అయ్యో! ఆమె యెట్లున్నది? ఎవ రామె?
శార : ఎట్లున్నది? ఎవ రామె? ఎంత యందకత్తె?

ఆ లలితాంగి చారుమధురాకృతి సాటి యనంగవచ్చు శం
పాలలితాంగి, యా మధురవక్రమనోహరనీలకుంతలన్
జేలలితాంగిఁ బోల్పదగు రేకిడు తెల్లని కన్నెతమ్మి యం
దాలకుఁ బుల్క లా సతి సుధాదృగనంతవిలాసవైఖరుల్.

కీచ : ఆమెను నాకుఁ జూపించవా?
శార : ఎచ్చటఁ జూపింపను?

ఆశాంతంబుల సాంధ్యకాలకుల నీలాంభోదగర్భంబునం
దా? సానంద చరన్మధువ్రతకులోత్తంసావలీగాయమా
నాశాగీతములందునా? యుదయవేళాంచత్సితాంభోద మా
కాశప్రాగ్దిగనంతశోచులన,! లేకన్ ప్రేమకున్ లోననా!

కీచ : ఓయీ! న న్నెందుకు వేధించెదు?
శార : అబ్బా! స్త్రీని జూడకయే నీ కెందు కింత విరహాము?
కీచ : మిత్రమా! అట్లుకాదు. నే నీనాఁ డొక జగన్మోహినిని

జూచితిని. ఆమెయు ఖేచరాంగనయే. వచ్చినదేమో యని యడుగుచున్నాను.

శార : ఆమె యెవరో నా కేమి తెలియును? నా వెంట వచ్చినచో యామెను జూపెదను. ఆమె యేమో గుర్తుపట్టు కొనుము.

కీచ : మఱి యామెను జూపించుము.

శార : కొంచె మాగుము.

కీచ : ఆగితిని.

శార : అదిగో! కన్నులు మిఱుమిట్లు గొనలేదా?

కీచ : (నవ్వి) అవును. ఆమెయు నిట్లే యుండునుగాని, యాయమె మాత్ర మీమె కాదు. ఆమె భూసంచారిణి.

శార : భూసంచారిణి కోసమేనా యింత యవస్థ.

కీచ : సఖుడా! అట్లుకాదు. అట్టి లతాంగి నెవ్వరును నెప్పుడును జూచియుండరు.

శార : ఆమె నీ కెచ్చట కనంబడినది?

కీచ : రాజాంతఃపురములో.

శార : ఆమె యెవరు?

కీచ : ఎవరో గంధర్వుల భార్య యంట.

శార : మిత్రుడా! అట్లయిన నా యోజన మానుము.

కీచ : ఎందుచేత?

శార : నీవు భూసంచారివి. వారు ఖేచరులు.

కీచ : ఓయి పిచ్చివాడా!

శార : నీవు మహానుభావుఁడవు. అందుకుఁ గాదు. కొంచె మాలోచించితివా యని,

కీచ : ఆలోచనలైనవి. అన్నియునైనవి. నా ప్రాణములు మాత్రము నిలుచునట్లు లేదు.

శార : అందుకు నే నేమి చేయుదును?

కీచ : తమ్ముఁడా! పరిహాసములు మాని యేదైన కథయైనను జెప్పుము.

శార : ఏమి చెప్ప మందువు?

కీచ : నీ యిష్టము.

శార : నా కొక్కటే కథ వచ్చును.

కీచ : అదియే చెప్పుము.

శార : అనఁగా అనఁగా ఒకరాజు.

కీచ : ఆ రాజున కేడుగురు కొడుకులా?

శార : కాదు. నలుగురు.

కీచ : తరువాతఁ జెప్పుము.

శార : ఇప్పుడు మనకథ యొక్కనితోనే.

కీచ : ఊఁ.

శార : ఆ యొక్కఁడు భార్యతో నడవికి వెళ్ళవలసి వచ్చినది. అచ్చట నొక రాక్షసుఁ డాయనభార్య నపహరించినాఁడు.

కీచ : ఇది నాకును తెలియును.

శార : తెలియదు.

కీచ : తెలియునయ్యా!

శార : తెలిసినఁ జెప్పుము.

కీచ : ఇది రాముని కథ.

శార : చివరి కేమైనది చెప్పుము.

కీచ : ఇది కాదోయి. ఇంకొకటి చెప్పుము.

